# అమ్మ - మహర్షి

( ఇద్దరు సిద్ధవ్యక్తుల సామ్య సౌందర్యం )

సంకలనము

డా. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

ప్రచురణ

మాతృశ్రీ పబ్లికేషన్సు ట్రస్టు

H. O. బాపట్ల. B. O. జిల్లెళ్ళమూడి.

# అమ్మ - మహర్షి

సంకలనమ్

డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

మాతృశ్రీ పబ్లికేషన్స్ ట్రస్టు

H. O: బాపట్ల : : B. O: జిల్లెళ్ళమూడి

## ఈ వాక్యాల కొరకు
## ఉపయోగించుకున్న పుస్తకాలు.

1. అమ్మ–అమ్మవాక్యాలు  ఈ సంకలన కర్తవే
   1 & 2 భాగాలు
2. మాతృశ్రీ జీవిత మహోదధిలో  రహి
   తరంగాలు (1 to 3 భాగాలు)
3. "మాతృశ్రీ" మాసపత్రిక  సంచికలన్నీ
4. "Matru Sri" Monthly Journal
   All numbers

## ఈ వాక్యాల కొరకు చదివిన పుస్తకాలు.



| | | |
|---|---|---|
| 1. | Bhagavan Ramana | T. M. P. Mahadevan |
| 2, | Ramana Maharshi | Arthur Osborne |
| 3. | Maha Yoga | Who |
| 4. | Ramana Maharshi | Chadwick |
| 5. | Self Realisation | B. V. Narasimha Swamy |
| 6. | Day by Day with Bhagavan | Devaraj Mudaliar |
| 7. | Talks with Ramana Maharshi | I to III volumes |
| 8. | Ramanavani | Back numbers |
| 9. | Works of Ramana Maharshi | ... ... ... ... ... |
| 10. | రమణాశ్రమ లేఖలు (1 to 5 భాగాలు) | సూరి నాగమ్మ |
| 11. | రమణ లీల (1 & 2 భాగాలు) | కృష్ణభిక్షు |



# ప్రశంస

అవతారపురుషు లనండీ, మహాపురుషు లనండీ.... మానవాతీతవ్యక్తులు సృష్ట్యాదినుండీ ఎందరో ఉద్భవిం చారు. చరిత్ర పరిశీలిస్తే – ప్రపంచంలో అన్ని ప్రాంతా ల్లోనూ మహోన్నత వ్యక్తులు మహామేరువుల్లాగా నిలబడి అమర జ్యోతులై దివ్యకాంతులు విరజిమ్ముతూ కనుపిస్తారు.

పశ్చిమవనిత విజ్ఞానధనుజను ప్రసవిస్తే–ప్రాక్పతి జ్ఞానఖనులను లోకానికి ప్రసాదించింది. ఒకరు బహిః ప్రకృతిని పరిశోధించి విజేత లయితే, మరొకరు అంతర్ ప్రకృతిని స్వాధీనం చేసుకొన గలిగారు.

అయితే–పడమటి దేశాల్లో తత్వవేత్తలు ప్రభవించ లేదనీ కాదు; తూర్పు దేశాల్లో విజ్ఞానవేత్తలు వెలుగు దివ్వెలను వెలిగించలేదనీ కాదు. సంఖ్యలో తారతమ్యాలు మాత్రమే.

తూర్పు దేశాల్లోనూ యీ జ్ఞాననిధులను ప్రపంచానికి అందించిన ఘనత మన భారత దేశానిదే.

ఉపనిషదృషుల తర్వాత, ఆచార్య త్రయం తర్వాత ....స్వానుభవంతో తత్వసందేశాన్ని అందించిన మహాత్ములు బహు అరుదుగా కనిపిస్తారు. ఇటీవలి కాలంలో జీవించిన

మహాపురుషుడు రమణ మహర్షి. ప్రస్తుతం మన మధ్య మసలుతున్న మహావ్యక్తి అమ్మ.

వీరిద్దరి జీవన విధానాల్లో అనుభవాల్లో ప్రవచనాల్లో ఎంతో సామ్యం కనుపిస్తుంది. అంతమాత్రంచేత వీరిద్దరి జీవిత రేఖలూ సమాంతర మని గానీ, వీరిద్దరి అనుభవం ఒకటే నని గానీ చెప్పడానికి వీల్లేదు.

అమ్మ జీవితంలో సాధనదశ లేదు. అమ్మది సజహస్థితి రమణమహర్షి సాధనచేసి ఆ స్థితిని చేరుకున్నారు. జీవితంలొ ఒక్క క్షణంలో నయినా ఆత్మస్థితినుండి ఏమరుపాటు ఎరుగని అపూర్వ వ్యక్తి అమ్మ. మొగ్గదశ లేని ప్రఫుల్ల కుసుమం అమ్మ. కనుకనే "పూర్ణచంద్రుణ్ణి చూడాలంటే మీరు జిల్లెళ్ళమూడి వెళ్ళవలసిందే. మరెక్కడయినా మీరు చంద్రవంకలను మాత్రమే చూడగలరు" అనీ, "అమ్మవంటి వారు యిదివరకు లేరు" అనీ ఉద్ఘాటించారు డాక్టర్ శ్రీపాద. అయినా వారిద్దరి అనుభవాల్లో ఆలోచనా రీతుల్లో ఎంతో సామ్యాన్ని వారు గ్రహించారు.

ఉపనిషదృషులు అందరూ దార్శనికులే అయినప్పటికీ—అందరి అనుభవమూ ఒకటిగా లేదు. మనం ఒకే విష్ణువుయొక్క అవతారాలని విశ్వసిస్తున్న రాముడు, పరశురాముడు కృష్ణుడు, బలరాముడు. గౌతముడు.... వీరందరి సందేశంలో అంతరాలు కనిపిస్తూనే ఉన్నాయి. ఆచార్యత్రయం అనుసరించిన మార్గాలు భిన్నంగానే ఉన్నాయి.

కానీ—మనం నిశితంగా జాగ్రత్తగా పరిశీలించ గలిగితే అటువంటి అమృత వల్లరులకు పూచిన ఒకే రకమయిన పువ్వులను గుర్తింవగలుగుతాము. ఆ ప్రసూనాలు రంగులో, వాసనలో ఒకే విధంగా గోచరిస్తాయి.

అటువంటి రెండు తీవెలకు విరిసిన ఒకే జాతి సుమాలను ఏరి కోసి రెండు దండలు కట్టారు శ్రీపాద.

ఒకరు అమ్మ; రెండవ వారు మహర్షి. ఇద్దరూ ప్రేమ స్వరూపులు; కరుణా సముద్రులు; వాత్సల్య జలధులు; జ్ఞాన సంపన్నులు; క్షమా మూర్తులు; పరిపూర్ణ మానవులు; మానవాతీత వ్యక్తులు; అవతారమూర్తులుగా లోకారాధ్యులు. వీరిద్దరినీ యీ విధంగా అపూర్వ పద్ధతిలో ఏనాటికీ వాడిపోని పూలతో దండలతో అర్చించుకున్న "శ్రీపాద" ధన్యజీవి.

— ప్రకాశకులు

# అమ్మ

1. "ఏ పద్ధతీ కానిదే ఇక్కడ పద్ధతి."

2 అమ్మదగ్గర భక్తులు కూర్చున్నప్పుడు గొంతులెలా ఉన్నా పాటలూ పద్యాలూ నిశ్శబ్దాన్ని భంగం చేస్తూనే ఉంటాయి.

3. ఆశ్రమంలో భోజనాలయినాక ఎవరి విస్తరి వారు ఎత్తి పారవెయ్యడం రివాజు.

4. అందరింటి భోజనం చాలా రుచి

5. "ఇది అందరిల్లు."

# మహర్షి

భగవాన్ ఆశ్రమవాసులకని నియమాలూ నిష్ఠలూ ఏవీ నిర్ణయించలేదు.

హాలు నిశ్శబ్దంగా ఉన్నట్లుండి ఏమూలనుంచో ఆడగొంతుతో పాటో, మగగొంతుతో పద్యమో వినబడేది.

రమణాశ్రమంలో భోజనానంతరం ఎవరి విస్తరి వారు తీసుకోవడం మామూలు.

ఆశ్రమ భోజనం కూడా మధురంగా ఉంది.

(ఉండవల్లి అంజనేయదాసుగారు.)

"మీ ఆశ్రమంలో మీరు ఉండడాన్ని ఎవరు ఆక్షేపించేది?"

# అమ్మ

6. అమ్మబిడ్డ హైమ సమాధిమీద భక్తులు గుడి కట్టేరు.

7. "ఈ హాల్లో కూర్చోవడమే ఎంతో ఉపయోగం."

8. "రిక్షాఅతను భోజనం చేశాడా?"

9. "ఇది రావటానికీ పోవటానికీ అడ్డులేని ఆవరణ."

10. "ఇక్కడికి ఇంతమంది ఎందుకు వస్తారో వారికే తెలియాలి."

11. అమ్మ పూజాసమయంలో తన పాదాలమీద తానే పూలు వేసుకుంటుంది.

12. "నాన్నా మీరూ అందరూ ఆలోచించి ఎక్కడుండమంటే అక్కడుంటాను."

13. "వాళ్ళు వస్తున్నారా? లేస్తాను. నీళ్ళు పెట్టించు."

# మహర్షి

భగవాన్‌తల్లిసమాధిమీద భక్తులు గుడి కట్టారు

"రావటమే ఉపయోగం."

"సమస్తమైన వారికీ ఆశ్రమ భోజనం పెట్టండి."

"నే నెవర్నీ రమ్మనను; పొమ్మనను."

"ఇక్కడ వీరంతా ఎందుకున్నారో వారికే తెలియాలి."

రమణులు కూడా రమణ సద్గురురాయరే అన్న పాట పాడేరు.

"అంతా కలిసి ఏది చేసినా ఇష్టమే!"

వచ్చేవారికి సునాయాసంగా దర్శనం లభించేందుకు ద్వారానికి అడ్డంగా సోఫా వేయించుకొని పడుకొనేవారు భగవాన్.

# అమ్మ

14. "ఎరగనివారు రారు ఇక్కడికి."

15. అమ్మ మొదట వేసే ప్రశ్న "భోంచేసేరా?" అని.

16. తన కడుపులో మంటగా ఉన్నా వచ్చేవారికి చాలవేమోనని అమ్మ మజ్జిగ త్రాగలేదు.

17. అమ్మ కళ్ళు వచ్చినవారిమీద అలాగ గాలిలాగ తిరుగుతాయి. 'నువ్వా' అని కాని 'ఎవరు చెప్మా' అని గాని భావమే ఉండదు.

18. అమ్మ జ్వరంలో ఉండి కూడా చూడడానికి వస్తు న్నారని "స్నానానికి నీళ్ళు పెట్టు" మన్నారు.

19. "రక్తమంతా ఈశ్వర తత్వమే."

20. అమ్మ ఏది మాట్లాడినా మూలంలోకే!

# మహర్షి

మహర్షికి ఎవ్వరూ పరిచయం చెయ్యనక్కరలేదనీ, ప్రతివారూ సూటిగా మహర్షితో మాట్లాడ వచ్చుననీ చెప్పేరు.

భగవాన్ ముందు భుక్తి, తరువాత ముక్తి విచారించేవారు.

తియ్యని మజ్జిగ అందరికీ చాలకపోతే తాను తీసుకోరు.

రమణుని కళ్ళు ఎల్లప్పుడూ ఒకే మాదిరిగా ఉంటాయి. ఆ నేత్రాలలో ఆవేశమూ అందోళన ఆలోచనలు ఛాయా మాత్రంగానైనా గోచరించవు.

భక్తురాలికి కనబడడానికి పుట్టకురుపుతో నీరసమైన రోజుల్లోకూడా బయటికి వచ్చి కూర్చున్నారు.

"బైట ఉన్నదా? ఉంటేనేం? అంతా బ్రహ్మం! ముట్టే మిటి? రమ్మనండి."

'వంట ఎలాగున్నా దాంట్లోంచి మాకో వేదాంతం.'

# అమ్మ

21. "నీకు ఏది సులువైతే అదే నీకు మంచిది."

22. "ఈ ఇసుక ఎగదొయ్యండి. చెదిరిపోతోంది."

23. అమ్మ ఇసుక కుప్పలు చెదిరి పోకుండానూ చాపలు విరిగిపోకుండానూ గ్లాసులు కాళ్ళక్రింద పడి నలిగి పోకుండానూ జాగ్రత్త పెట్టమనేవారు.

24. స్వర్ణోత్సవంలో మిగిలిన అన్నం చేపలకు పిట్టలకు చీమలకు చల్లేరు.

25. అమ్మ గుర్రుపెడుతున్నట్లే ఉంటారు. అమ్మా- అంటే పలుకుతారు.

26. "నన్నేదైనా చెయ్యాలని వచ్చినవాళ్ళను ముందు దగ్గరకు తీసుకొంటాను" అన్నారు అమ్మ.

# మహర్షి

ఎవరికేది సులభమార్గమో భగవాన్ తెలుసుకొని సూచించే వారు.

వంటయింటి దగ్గర అటూ ఇటూ ఉన్న బియ్యపు గింజలు ఏరేవారు మహర్షి.

పోస్టుద్వారా వచ్చిన పుస్తకాలు కట్టిన కాగితాలూ దొరికిన పెన్సిలుముక్కలూ దాచిపెట్టేవారు తమ ఉపయోగానికి.

ఆ రోజుల్లో ఎవరు ఏమి అర్పించినా అది పంచిపెట్టేయాలి. చీమలకూ, ఉడతలకీ, పిల్లులకూ కుక్కలకీ, ఆవులకీ తినిపించేవారం.

భగవాన్ నిద్ర చాలా పల్చన. చీటికీ మాటికీ లేస్తూనే ఉండేవారు.

"నేను నిన్ను చంపి కీర్తికెక్కుతాను" అన్న బ్రాహ్మణ్ణి హాల్లో వాళ్ళు అటకాయించి తోసెయ్యాలని చూసేరు. భగవాన్ అతన్ని తనదగ్గరే ఉంచుకొని తన భోజనానికి తీసికొని వెళ్లేరు.

# అమ్మ

27. 'మా సాధన ఏమిటమ్మా?' అన్న ముగ్గురికి మూడు వేర్వేరు జవాబులు.

28. అన్ని ప్రశ్నలకూ అమ్మ చిట్టచివరి సమాధానం ఒకటే! "అన్నీ అదే" అని. అయితే బయలుదేరడం పృచ్ఛకుడి మట్టంనుంచే!

29. "ఎక్కడి కక్కడ నేను లేకుంటే జరగదనుకొనే వారు లేనప్పుడు కూడా సవ్యంగా నడిచిపోతుంది పని."

30. పోట్లూరి సుబ్బారావుగారు ఒకనాడు 12 మార్లు ఫోటో తీస్తే అమ్మరూపం ఒక్కటీ రాలేదు.

31. "మీ అబ్బాయి నా దగ్గరే ఉన్నాడు."

32. అమ్మ వాగులో స్నానంచేస్తూ పాములు కొట్టుకొని వస్తూ వుంటే తీసి వడ్డున వేసేవారు.

33. అమ్మను చూస్తూ కన్నీళ్ళు కారుస్తారు.

# మహర్షి

ఒకే పరిస్థితిలో ఒకే ప్రశ్నకు భగవాన్‌నుండి వేరు వేరు జవాబులు.

అన్ని ప్రశ్నలకూ భగవాన్ చిట్టచివరి జవాబు "నువ్వెవరో తెలుసుకో" అని. అయితే బయలుదేరడం పృచ్ఛకుడి మట్టం నుంచే!

భగవాన్ ఎక్కడి కక్కడ శిష్యుల అహాన్ని అణచేవారు.

ఒక ఫోటోగ్రాఫర్ మహర్షి ఫోటో తీయబోతే ఏమీ రాలేదట.

"ఎక్కడికి పోయాడు నీ కొడుకు? ఇక్కడే ఉన్నాడు."

రమణుల వంటిమీద పాములు పాకేవి.

అయన్ని చూస్తూంటే భక్తులకళ్ళ నీటి ధారలు కారేవి.

# అమ్మ

34. 'లోకంలో అక్రమాలూ అన్యాయాలూ చేసినవారే పైకి వస్తున్నా రమ్మా' అని ఒక ఆయన అంటే అమ్మ అన్నారు "నీకూ చేతనైతే నీవూ అలాగే ఉండు నాన్నా" అని.

35. 'మీ అమ్మ నాకు కలలో కనబడి నిన్ను తెనాలి తీసికెళ్ళమని చెప్పింది' అని అమ్మ మాతామహుడు వెంకటసుబ్బయ్యగారు.
"అమ్మ నాకు కలలో కనబడి చెప్పలేదు" అని ఆరేండ్ల బాలికగా అమ్మ.

36. శివరాత్రినాడు అమ్మ రాధాకృష్ణశర్మగారికి— ఉదయమే తన తండ్రిగారికి అన్నం పెడుతూ— ముద్దలు పెట్టారు. "ప్రసాదంగా తిను నాన్నా" అన్నారు. అలాగ కొంతసేపు పెట్టి "హేయ్ శివరాత్రి నాడు స్నానం చెయ్యకుండానే భోంచేశాడు" అన్నారు. ఆయన ఆనాడు ఉపవాస ముందా మనుకొన్నారు.

# మహర్షి

ఆశ్రమంలో ధనార్జనే ముఖ్యంగా ఉందని దర్శించ వచ్చినవారు అంటే భగవాన్ అనేవారట "వాళ్ళు ధనం కోసం చేరేరు. నీకూ ఆశ ఉంటే వాళ్ళలో చేరు, భాగం పెడతారేమో!" అని.

'నాకు ఒక సిద్ధపురుషుడు కలలో కనబడి మీకు దత్తాత్రేయ మంత్రం ఉపదేశించమని చెప్పేడు. మీరు ఉపదేశమువండి.'

"మీకు చెప్పిన సిద్ధుడు నాకుకూడా ఉపదేశమువ మని చెప్పేదాకా ఆగండి."

రమణస్వామి అమావాస్యనాడు తనను చూడవచ్చిన శ్రోత్రియులను ఫలహారానికి రమ్మని పిలిచారు. వారు ఏం తోచక చివరికి కాదనలేక వెళ్ళి ఉప్మా తిని కాఫీ త్రాగారు. భగవాన్ ఉల్లిపాయ సుగుణాలు వర్ణించి "ఉల్లిపాయలు సరిగ్గా వండితే వాసనవెయ్యవు" అని ఆ శ్రోత్రియులవైపు తిరిగి "ఇందాకా మీరు తిన్న ఉప్మా ఏమన్నా ఉల్లిపాయల వాసన వేసిందా?" అన్నారు.

# అమ్మ

37. 'అదేమమ్మా నీ తలగడా మీద పిల్లి పడుక్కుందీ?'
"ఏం, అదేనా అంత తక్కువదీ?"

38. 'ఎన్నాళ్ళీ దుఃఖాలు?'
"బ్రతికున్నన్నినాళ్ళూను."

39. 'నాకు కీళ్ళవాత మమ్మా!'
"నాకు కాళ్ళ నొప్పులు."

40. "మనం (పాములు) అవి ఉండే చోటికి వచ్చాము."

41 బృందావనం పోదా మమ్మా— అని ప్రభుదత్త బ్రహ్మచారి అంటే దగ్గరలో ఉన్న వాగువద్దకు తీసుకు వెళ్ళి—ఇదుగో బృందావనం—అన్నారు అమ్మ.

42. "బయట గానా; లోపల బజానా."

# మహర్షి

'ఆ కుక్క ఎప్పుడూ నీ వడిలో అట్లా పడుకుంటుందేం?' అని తల్లి.

"కుక్క ఎప్పుడూ నిర్వికల్ప సమాధిలో ఉంటుంది. ఓ గొప్ప ఆత్మ ఈ కుక్క రూపంలో వచ్చింది."

"నేను బ్రతికున్నన్నాళ్ళూ దుఃఖం తప్పదు."

"వారు కళ్ళకు జబ్బు లంటారు. నా కాళ్ళకు జబ్బు. నే నెవరితో చెప్పుకొనేది?"

"మనం పాముల గృహంలోకి వచ్చాము. వాటికి ఇబ్బంది కలిగించడానికి మనకు హక్కు లేదు."

రంగస్వామి కాశీ కాశీ అంటే "ఆ రెండు అక్షరాలూ విడిచేస్తే ఇదే కాశీ" అన్నారు స్వామి.

"అది ఆట (వెలది). ఇది తేట (గీతి)."

# అమ్మ

43. "నేనెవరితో చెప్పకుండేది?"

44. "నేను అంతటా ఉన్నా నంటూ మంత్రపుష్పానికి సన్నిధి అంటూ గిరిగీస్తావేం?"

45. "నీ యిష్టం నాన్నా. గంధం కాళ్ళకు కావలిస్తే కాళ్ళకో చేతులకో మెడకో రాసుకో."

46. దొంగతో "ఉండు పులిగోరు పతకం నే నిస్తా. నీకు రాదు. చెయ్యి నొప్పి పుడుతుంది."

47. అమ్మకి పళ్ళబుట్ట ఇచ్చారెవరో. దానిలోని పుల్ల రేగుపళ్ళు ఏరి అమ్మ తినేసేరు — రొంపగా ఉన్న పిల్లలు తిని ఎక్కువ చేసుకొంటారని.

48. అమ్మ తన కుటీరం దగ్గరుండే కుక్కకి కొబ్బరి చిప్ప అందించేవారు.

# మహర్షి

"చెప్పుకోడానికి మీకో స్వామి ఉన్నాడు. నా కెవరున్నారు?"

"స్వామివైపు కాళ్ళు చాచరాదా? స్వామి ఎక్కడ లేడూ?"

"ఎవరెవరి చిత్తవృత్తి ఎట్లా ఉంటే వారి వారి చిత్తానుసారం పోవలసిన విధి మనకుంది."

"ఏమిటీ? లక్ష్మి (ఆవు) వంటహాల్లోకి వెళ్ళి వేడి పాయసం త్రాగేసిందా? పాపం, దాని నాలిక ఎంత కాలిందో!"

పళనిస్వామి జబ్బుగా ఉన్నప్పుడు మహర్షి అతని తలగడా క్రింది మామిడిపండు తీసి తినేశారు, అతనికి అది చెరుపు అని.

ఆశ్రమ గోవులకు ఇడ్లీ పెట్టించేవారు మహర్షి.

# అమ్మ

49. 'ఆయన పరమతాల్ని తిట్టిపోస్తాడమ్మా' అన్నారు ఒక ఉపన్యాసకుల గురించి.
"ఆయన పబ్లిగ్గా తడతాడు. మనం ఇళ్ళలో రహస్యంగా తడతాము. మనకంటే ఆయన పద్ధతే మంచిది."

50. అమ్మ ఉన్న కుటీరానికి దూరంగా ఉన్న పాకలో సాగర్‌గారిని మెల్లగా అడిగేను నేను 'డైరీలు ఏవైనా ఉన్నాయా?' అని.
దూరంగా ఉన్న అమ్మ —
"ఆయన డైరీలు అడుగుతున్నారు చూడు" అన్నారు రామకృష్ణతో.

51. అమ్మను ఒకమారు చూసినవారు మళ్ళీ మళ్ళీ వస్తారు జిల్లెళ్ళమూడికి.

52. ఈ అమ్మ పలుకరించలేదేమిరా అనుకొన్నారు— మాచెర్ల లెక్చెరరు.
"బాగున్నారా?" అన్నారమ్మ.

# మహర్షి

ఘటికుడొకడు మరణించిన వార్త వచ్చింది. అంతా అతని పెద్దతనం గురించి తలొక మాటా అన్నారు.

భగవాన్ అన్నారు "నిజమే! ఆయన చాలా శుభ్రంగా ఉండేవారు. రోజూ రెండు మార్లో మూడు మార్లో స్నానం చేసేవాడు."

భగవాన్ చివరి రోజుల్లో ఒక సాధువు వస్తే ఆశ్రమం వారు చూడడానికి వీల్లేదన్నారు. అతడు అక్కడే నిలబడి భగవాన్ పడుకొన్న గదివైపు చూస్తున్నాడు. సాధువు కళ్ళు వెడల్పుగా తెరుచుకొన్నాయి. గదిలో నుండి వరండాలోకి వచ్చి ఆయనకి దర్శనం ఇచ్చారు భగవాన్.

"ఇక్కడ అనుబంధం కలవారు ఏ మూల ఉన్నా రావలసినదే!"

'భగవాన్ నావైపు చూడండి! అనుకొంటాను, చూస్తారు.'

# అమ్మ

53. 'ఈ పటికబెల్లంముక్క భాస్కరరావుగారికి ఇస్తే బాగుండును' అనుకొన్నాను చిన్న ముక్క అమ్మ కిచ్చి వచ్చేస్తూ.
అమ్మ ఆ ముక్కను ఆ తర్వాత నాలుగోవారిగా వచ్చిన భాస్కరరావుగారికి ఇచ్చారు.

54. "లౌకికానికీ ఆధ్యాత్మికానికీ తేడా లేదు."

55. "అడిగి తెలుసుకోడానికి ఏమీ లేదు."

56 అమ్మవీపుమీద బెత్తంతో వేశాడు మౌనస్వామి శిష్యుడు. అమ్మ ఏమీ అనలేదు.

57. "నాకు ప్రత్యేకం ఒక రుచి అంటూ దేనికీ లేదు."

58. "నేను ఒక ఆచారం అంటూ ఏదీ పాటించను."

59. 'ఈ పూజా కిరీటమూ ఎందుకమ్మా మీకు?'
"ఏది వద్దన్నాను కనుక ఇది వద్దనడానికి!"

# మహర్షి

వెళ్ళేముందు 'భగవాన్ నావంక చూడండి' అనుకొన్నారు నర్తకి. భగవాన్ చూసేరు. మర్నాడు చలంగారూ అలా అనుకొంటే అయనవైపూ చూసేరు.

బైబిలు చెప్పిన స్వర్గరాజ్యమూ ప్రపంచమూ వేరు కావు.

మహర్షికి తీర్చుకోడానికి సందేహాలు లేవు.

అతడు భరించలేక అగ్రహంతో భగవాన్ ముఖం మీద ఉమ్మేడు. భగవాన్ ఏమీ అనలేదు.

"అవీ, నువ్వుచేసినవీ అన్నీ ఏకంగా కలుపుకొని తినేనాకేం రుచి?"

భగవాన్ ఏ అచారాలూ పాటించేవారు కారు.

'ఈ సోఫా పంకా ఎందుకు స్వామీ?'
"జరిగేవి జరుగుతాయి. నేను వద్దంటే మానారా?"

# అమ్మ

60. "ఇక్కడ ఒక దోమ ముద్దుపెట్టుకొంది."

61. "నువ్వు విద్యాయనమః – అంటే వారు అవిద్యాయ నమః–అంటున్నారు. అంతే కదా!"

62 "పట్టుచీరలా? గోనెపట్టలూ కట్టుకోవచ్చు. ఏమీ లేకుండానూ ఉండవచ్చు!"

63 'నీకు నొప్పులు లేవమ్మా?'
"ఎందుకు లేవండీ? ఉన్నాయి."

64 భక్ష్యాలతో నిండిన విస్తరి తెచ్చి ముందు పెడితే అన్నీ కలిపి ముద్దలు పెట్టేవారు.

65. అమ్మ బండిఎద్దును నిమురగానే అది అమ్మపాదాల మీద ముట్టెను పెట్టి ప్రాణాలు వదిలింది.

66. "ఎవరూ లేని పెట్టు నాకెందుకూ? అందరూ ఉన్నప్పుడు పెట్టిందే పెట్టు".

# మహర్షి

"మీరంతా లడ్డూలు తినిపించినట్లే వారు దెబ్బలు తినిపించారు."

"(కర్రతో కొట్టడమా?) అది పూజే!"

"ఈ చెట్టు క్రింద కూర్చున్నా పెంటకుప్పమీద కూర్చున్నా–నాకు హాయిగానే ఉంటుంది."

"ఇటు చేతిని అటు కదిపితే పర్వతాలు కదుల్తాయి."

ఎన్నో పదార్థాలు ముందు పెడితే అన్నిటిలోంచీ కొంచెం కొంచెం తీసి ముద్దచేసి తినేవారు.

భగవాన్ ప్రేమతో ఆ కాకిని తాకగానే అది ప్రాణాలు విడిచింది.

"నేనేం వంటరిగాణ్ణా యేమి? గంపంత సంసారం."

# అమ్మ

67. "అఁ" అని అమ్మ అంటే తప్పు దిద్దుకుంటారు వ్యాస కారులు.

68 "నేను చెప్పేదంతా నా అనుభవమే నాన్నా."

69. రాజమ్మగారు అమ్మకి ఉపదేశం చేయబోతే ఆమెకే ఏవో దర్శనాలు కలిగేయి.

70. "అంత మాత్రం నీవెనక లే ననుకొన్నావా?"

71. హైమ వెళ్ళిపోయిన మూడవరోజున అమ్మ జన్మ దినోత్సవాలు జరగవలసి ఉన్నాయి.
'ఇవి ఆపించేస్తా నమ్మా' అమ్మగారి అబ్బాయి సుబ్బారావు.
"అది ఆపగలిగేవురా?" అన్నా రమ్మ. ఉత్సవాలు జనం యథాప్రకారం జరుపుకొన్నారు.

72. "జిల్లెళ్ళమూడికి రావడం ఎప్పుడూ వృధా కాదు."

# మహర్షి

"అవి తిరిగి చదవండి" అని భగవాన్ అంటే అప్పుడు మళ్ళీ చదివి పండితులు తమ దోషాలు దిద్దుకుంటారు.

"గ్రంథాలు తీసుకు చదివితే అందులో వచ్చేదంతా మనకు అనుభవమై ఉండేదే!"

ఒక సాధువు భగవాన్ నెత్తిమీద చెయ్యిపెట్టేడు. ఆ సాధువే నిద్రలో మునిగిపోయాడు.

"ఏం భయం? నేను వెంటలేనా?"

మహర్షి పుట్టకురువుతో బాధపడుతున్నారని చిన్న స్వామి దర్శనాలు ఆపించారు. అందుకని దర్శనాలు మళ్ళీ ఏర్పాటయ్యేదాకా మహర్షి భోజనం చెయ్యలేదు.

"ఈ ద్వారంలోంచి మోక్షానికి ప్రవేశార్హత కలుగుతుంది."

# అమ్మ

73. అమ్మ పాటలు లేత తమలపాకు కంటె మెత్తన.

74. భక్తులు పెట్టిన చద్దెన్నమూ, చేపలకూర, అంబలి—అన్నీ అమ్మ తిన్నారు.

75. అమ్మ చేతులలో బండిఎద్దూ, కుక్కా, కోటేశ్వరరావు గారితల్లీ వసుంధరతల్లీ పోయారు.

76. పాముపడగ మీద చెయ్యి పెట్టి అమ్మ "రండి తాత గారూ" అంటే చిదంబరరావుగారు హడలిపోయారు.

77. ఎద్దు తొక్కిన మల్లికార్జునుడి గుండెనొప్పిని అమ్మ స్వీకరించారు.

78. అమ్మ కాఫీ అడిగేరు. ఇంట్లో పంచదార లేదు. అన్నపూర్ణ నొచ్చుకొని ఎప్పుడూ వాడని డబ్బా తీస్తే అందులో పంచదార ఉంది.

# మహర్షి

'భగవాన్ ఒళ్ళు ముఖమల్‌లాగ మెత్తగా ఉంది' అన్నారు, కాళ్ళు రాసిన రంగన్.

భగవాన్ చలిదికూడూ, సంకటీ అన్నీ తిన్నారు.

భగవాన్ ఒళ్ళో లేడీ కాకీ అలఘమ్మా లక్ష్మి పోయి నారు.

'రమణుల దేహంపై పాములు యథేచ్ఛగా తిరిగేవి నేను భయంతో వణికిపోయేదాన్ని' అని అళగమ్మ.

కె. రామచంద్ర వెన్నెముకపోటును భగవాన్ స్వీకరించారు.

స్వామి నారింజకాయ ఊరగాయ అడిగేరు. లేక పోయిందని చిన్నస్వామి నొచ్చుకున్నారు. వెంటనే రెండు బుట్టలతో నారింజకాయలు వచ్చాయి.

# అమ్మ

79. తన భార్య బయటవేరిందని బాధపడే గృహస్థుతో "నువ్వూ మీ ఆవిడా కలసి వచ్చి పెడితే నేను ఆ చీర కట్టుకొంటాను."
[తండ్రిగారి కర్మకు బయట చేరేనని బాధపడిన గాయత్రికి అమ్మ 'మలమూత్ర విసర్జన వంటిదే ఈ దేహ ధర్మమూను' అని చెప్పి ఏ కించా లేకుండా అన్నీ యథావిధిగా జరిపించమన్నారు.]
జిల్లెళ్ళమూడిలో అమ్మసన్నిధిలో మనిషి పోతే మైల అనేది పాటించరు.

80. మన్నవలో అమ్మ దిగిన ఇంటి గుమ్మం ముందు ఒక రెడ్డిసుబ్బయ్యగా రుండి 'భోంచేసి వెళ్ళండి' అంటున్నారు. అసలు రెడ్డిసుబ్బయ్యగారు జిల్లెళ్ళ మూడిలోనే ఉన్నారు.

81. అమ్మని చూడడానికి వచ్చేవారు పెక్కురు వెక్కి వెక్కి యేడ్చేస్తారు. ఇది దిన దిన దృశ్యం.

82. 'అమ్మా! నే నిచ్చిన నారింజపండు హైమకిచ్చారా?'
"ఎవరి కవసరమైతే వారి కిచ్చాను. ఏం?"

# మహర్షి

"బైట ఉంటే మైలా? అట్లా భేదం చూపకండి. అందరికి మల్లేనే పెట్టండి."

గేటులో ఒక స్వామి 'ముందు భోజనానికి పదండి' అన్నారు.

రంగస్వామి, నర్తకి, బీగం సయ్యదు మొదలైన వారంతా మహర్షిని చూసినప్పుడు ఆవేశం పట్టలేక ఏడ్చేశారు.

'మేము ఎంత వేడుకున్నా మాకేమీ ఇవ్వరు. ఆ మస్తాన్ అడక్కపోయినా అన్నీ యిస్తారు.'

# అమ్మ

83. 'అమ్మ నా మౌనప్రార్థనను రెండు మారులు మన్నించి తీర్చారు.'

84 అన్నం తినని వారిని ఏరినట్లుగా అమ్మ భోంచేశారా అని అడిగి "వెళ్ళి భోంచేసి ర"మ్మంటారు.

85. చెరుకుమిల్లి హనుమంతరావుగారు వాళ్ళబ్బాయి తిరుపతి మొక్కు అమ్మ సమక్షంలో తీర్చారు.

86 'అమ్మా—మీా రే మంత్రం జపించారూ?' అని అడిగితే "సరే మంత్రం" అన్నారు.

87 "ఏమన్నా ఒకే వాక్యం."

88. పాదాల మీాద చేతులూ తలా పెట్టి విలపించేవారి తల తడుపుతారు అమ్మ.

# మహర్షి

భగవాన్– డాక్టరు కరంచందాని మౌన ప్రార్థనను మన్నించారు.

ఆకలితో ఉన్నవారిని ఇట్టే పసికట్టి రమణులు ఆహారం ఇస్తారు. అందరి భోజనం అయితేగాని వారి భోజనం ముగించరు.

దేవరాజు మొదలియార్ వెంకటేశ్వరస్వామికి చెల్లించ వలసిన మొక్కును శ్రీరమణభగవాన్‌కే చెల్లించారు.

రమణస్వామికి ఒకప్పుడు "అమాస్వామి" అనే బిరుదుండేదట. ఆమా అంటే ఊఁ– అని అర్థం.

ఏక మక్షరం హృది నిరంతరం, భాసతే స్వయం విలిఖితే కథం?

బుచ్చమ్మగారు మహర్షి మెట్లు దిగుతున్నప్పుడు గభీమని పాదాలు పట్టుకుంది.

మహర్షి ఆమె తలను ఆప్యాయంగా తణిమేరు.

# అమ్మ

89. "ఆఁ చెప్పేరు లెద్దూ చాలు" అన్నారు అమ్మ రాఘవయ్యగారితో. ఆయన తనను బస్సెక్కించిన అదృశ్యబలాఢ్యుని సంగతి చెప్తే. (ఆయన అంధులు.)

90. "పొడుగూ పొట్టియే కాని మంచిచెడ్డలనగా ఏమిటి?"

91. "మీరు కానిది నేనేదీ కాదు నాన్నా."

92. "నన్ను చూడడమే పుణ్యం."

93. "నేను మీలో దైవత్వాన్ని చూస్తాను.
మీరు నాలో మానవత్వాన్ని చూస్తారు."

94. 'ఏమిటాలోచిస్తున్నావూ?.'
"నన్ను గురించే."
'ఏం? మమ్మల్ని గురించి అనుకొన్నా.'
"నాలో మీరంతా లేరూ?"

95. "నేను తప్పు తలంచితే ఏడోమైలు దాటి వచ్చే దెవరూ?"

# మహర్షి

రమణులు "నిన్ను రైలు దింపి మాయమైన మౌల్వీని నేనే" అన్నారు ఇంద్రజాలితో.

"నా దృష్టిలో చెడ్డ అనేదే లేదు."

"ఒకే ఆత్మ మన ఇద్దరిలోనూ ఉంది."

"నాయెడల భక్తి గలగడమే గొప్ప అర్హత."

"మీకు దేహాత్మ బుద్ధి వదలనంతవరకు మీరు నన్ను దేహిగానే చూడటం తప్పదు."

"కన్నులు అరమోడ్చి ఏమి చూస్తున్నారూ?
నన్నే, నేను తప్ప వేరేమీ లేదు."

"నేనే దండించడం ప్రారంభిస్తే ఆశ్రమంలో నల్లకాకి వాలదు "

# అమ్మ

96 తనను గురించి అమ్మ "నేను" అనే అంటారు.

97. "మీరే నా దైవం."

98. "తగలవలసిన దెబ్బలు ఎలాగూ తగుల్తాయి."

99. "మీరు కానిది నేనేమీ కాను నాన్నా."

100. 'అమ్మా–నా తప్పు క్షమించండి'
"నేను తప్పనుకుంటె కదా!"

101 "నే నెప్పుడూ చూలింతనూ బాలింతనూ గదా!"

102. "ఎక్కడికి పోనూ?"

103 "నాకంతా శిశువులే. శిష్యుల్లేరు."

104 "అడిగి తెలుసుకోడానికి ఏమీ లేదు."

105. "నేను ఎప్పుడూ ఇది చెయ్యండి–అని చెప్పను."

# మహర్షి

మహర్షి "నేను" అంటూనే మాట్లాడుతారు.

"నాకు ప్రతివాడూ మహర్షే!"

"మోయవలసి ఉన్నది. మోశాను."

"మీ చేతికీ నా చేతికీ తేడా లేదు.
విబూది తీసికొని వెళ్ళండి."

'భగవాన్ నేను చేసిన అపచారాన్ని మనస్సులో ఉంచుకోకండి.'

"మనస్సేది నాకు ఉంచుకోడానికి?"

"నేను వంటరిగాణ్ణా ఏం? గంపంత సంసారం!"

"నా కెక్కడికి పోయేందుకు స్థలం లేదే?"

"నే నెవర్నీ నాకు శిష్యు డనుకోవడం లేదు."

మహర్షికి తీర్చుకోడానికి సందేహాలు లేవు.

మహర్షి నిన్ను ఏదీ మింగమనరు.

# అమ్మ

106. "మీరు కానిది నేను ఏదీ కాను నాన్నా."

107. "అంతా నేనే అనుకొంటే ఇక భక్తు లెవరూ?"

108. "నేను ఒకటంటూ ఏదీ పాటించను."

109 "అడిగేవు కనుక చెప్పడం."

110. "సెలవుల్లో ఇక్కడికి వస్తూ ఉండు."

111. "నేను అంటే అనసూయ అని కాదు. అన్ని నేనులూ నేనైన నేను."

112. "వాడూ నా కొడుకే నాన్నా."

113. నమస్కారం చేస్తే ఏమీ జరగనట్లే ఉంటారు అమ్మ.

114. "నీకు ఒక్కడే కొడుకు. నా పిల్లలు ఎంతమందో చూడూ. వీళ్ళ అల్లరి నేను భరించడంలేదూ?"

# మహర్షి

"నువ్వు ఆ స్థితికి చేరుకున్నప్పుడు నాలో ఏమీ ప్రత్యేకత లేదనీ నువ్వూ అదే ననీ, తెలుసుకొంటావు."

"అంతా ఒకే కన్ను. మరి ధ్యానింపదగినదేది? ధ్యానించు వాడెవడూ?"

"నాకు మతం లేదు."

"ఉపదేశాలు కావాలన్నవారికే చేస్తున్నాను."

"మీకు సెలవులే కదా! ఇక్కడే ఉండండి."

"నే నెవరనుకున్నారూ? అందరిలో ఉన్న నేనును నేను."

"ఆమె (వ్యభిచారిణి) మాత్రం నా బిడ్డ కాదా?"

నమస్కారం చేస్తే ఎవరికో నన్నట్లుంటారు మహర్షి.

"సీకు ఒక కుటుంబమే ఉన్నది. అందరి కుటుంబ భారమంతా నా భుజాలమీదే ఉంది."

# అమ్మ

115. "నా కొడుకు దగ్గర (తిరుపతి) అయితేనేం? నా దగ్గర అయితేనేం?"

116. "నేనూ అర్పిస్తున్నాను నాన్నా మిమ్మల్ని. నేను మిమ్మల్ని అర్పించినట్లు మీరు నన్ను అర్పించలేరు."

117. "నాకు గోడ చాటు లేదు."

118. "పాపమైనా వీడు చెయ్యలేడంటున్నా."

119. "మన కంటే పాములు నయమే. అవి వాటికి అపకారం చేసినవారిని హింసిస్తే, మనం ఎరగని వారినీ హింసిస్తాము."

120. "ఎవరన్నం వారు తిని పోతున్నారు."

121. "తెలుసుకోవటమేముంది? తెలియబడతాడు."

122. "నీ పేరు పడాలనడం ఎంత అహంకారమో పడరాదనడమూ అంత అహంకారమే!"

# మహర్షి

"పళనిలో ఉన్న స్వామి ఇక్కడ లేరు కాబోలు!"

"మీరు సాష్టాంగపడకముందే నేను మీకు సాష్టాంగ పడుతున్నాను."

"కళ్ళు మూసుకుంటే మాత్రం చూడలేనా?"

"వ్యక్తులు ఎప్పటికీ స్వతంత్రంగా వ్యవహరించలేరు."

"కోతులు ఒక్కొక్క పండే పట్టుకు పోతాయి. మనుష్యులు అన్నీ ఒకమారే కోసేస్తారు."

"మనం తినవలసి ఉంటే అవే వస్తాయి."

"మన మర్పించుటేమి? తానే అర్పణ అవుతుంది."

"కోరికలు వద్దనటమూ కోరికే!"

# అమ్మ

123. "వికారంతోనే అకారం వచ్చింది."

124. "ఆ కోపంమీద కోప్పడు."

125. "చచ్చినవాడి కోసం కాదిది"

126. "ఏది చేసినా తనకోసమే."

127. "నిన్న చేసిందే నేడు జ్ఞాపకముండడం లేదు. ఇక ఎప్పటిదో ఎందుకూ?"

128. "తెలియదనేనా తెలిసికొన్నావుగా!"

129. "అన్ని బాధలూ, చివరకు శారీరకమైనవి కూడా మనస్సునకు మాత్రమే!"

# మహర్షి

"ఈ శరీరమే ఒక రోగం."

"ఆ కోపంమీద కోప్పడండి. సరిపోతుంది."

"ఇప్పుడు నువ్వు తర్పణం వదలి వాళ్ళని పైకి పంపవలసిన అవసరం లేదు."

"పరోపకార బుద్ధి స్వార్థపూరితమైనదే – ఇతరులందరూ సంతోషంగా ఉంటే నీకు సంతోషంగా ఉంటుంది కనుక."

"ఈ జన్మలో అహంత భారమై తోసివెయ్యడానికి వీలుపడకున్నది. భూత భవిష్యత్తుల గురించి తెలిసికోవాలని ఉబలాటం లేకపోవడం ఉత్తమం."

"ఏమీ తెలియదే అన్నది తెలుసుకొనేందుకు ఒకడున్నాడు గదా!"

"ఏది అనుభవించేదైనా మనస్సే!"

# అమృత

130. "వాడి అన్నం ఇక్కడ లేకపోతే వాడిక్కడకు రాడు."

131. "ఇక్కడికి వచ్చేటప్పుడు ఏడో మైలు దగ్గర సంచీ తగిలించి వస్తారు. కొన్నాళ్ళుండి వెళ్ళేటప్పుడు మళ్ళీ ఆ సంచి పట్టుకు పోతారు."

132. "సన్యాసి అవాలి కాని పుచ్చుకోవడం కాదు."

133. "నీ భర్త నీ హృదయంలోనే ఉన్నాడు.
భర్త అంటే రూపమే కాదుగా!"

134. "ఇతరులలో మంచిని చూడడమే మన మంచి తనం."

135. "చేతలు చేతుల్లో లేవు."

136. "అన్నీ అమ్మే చేసింది — అన్న స్థితి రావడమే అనుభవం."

# మహర్షి

"మనది కాకపోతే మన కెలా వస్తుందీ?"

"ఇక్కడికి వచ్చి ఆనందంగా నృత్యం చేస్తాడు. వెళ్ళేటప్పుడు – ఇక్కడికి వచ్చేటప్పుడు దించిన పాపపు మూటని భుజాన పెట్టుకొని వెళ్ళిపోతాడు."

"అహాన్ని వదలడం సన్యాసం కాని దుస్తులు మార్చడం కాదు."

"నీ నాథుడు నీ హృదయంలోనే ఉన్నాడు."
నేనెక్కడని వెదికేది? – అన్న భృంగ సందేశం వినిపించారు.

"ఇతరులకి మంచి చెయ్యాలనే ఆలోచనే మంచిది."

"ఒక మహాశక్తి ఎవరేది చెయ్యాలో నిర్ణయిస్తుంది."

"అనుభవం అంటే ద్వంద్వాలు అతిక్రమించడమే!"

# అమ్మ

137. "అర్పణ అంటూ చేసిన తర్వాత ఇంక అక్కడ మిగిలిం దేమిటి?
కోరికలు పోవాలి– అన్నదీ కోరికే!"

138. "అద్వైతమే విశిష్టత–అని శంకరులు.
విశిష్టతే అద్వైత–మని రామానుజులు."

139. "బ్రాహ్మణుడు తప్పు ఇది చెయ్యరాదనే వాడు బ్రాహ్మణుడు కాడు."

140. "ఇష్టం లేనిదే కష్టం."

141. "నిగ్రహం కోసమే విగ్రహారాధన."

142. "అమ్మ అడ్డు లేనిది."

143. "తెలిసి వచ్చేది కాదు. వస్తే తెలిసేది కాదు."

144. "నా దృష్టిలో జడమే లేదు. అంతా చైతన్యమే!"

# మహర్షి

"మోక్షాపేక్ష కూడా శరణాగతికి అడ్డే!"

"సకలమూ బ్రహ్మమే–అని అద్వైతులు.
సకలంలోనూ బ్రహ్మము విశిష్టమై ఉన్న–దని విశిష్టాద్వైతం."

"బ్రహ్మమును తెలుసుకున్నవాడు బ్రాహ్మణుడు."

"కష్టమంటే అక్కరలేని ఆలోచన."

"విగ్రహారాధన మనోనిగ్రహానికి దారి చేస్తుంది."

"ఆధ్యాత్మికత అందరిదినీ. ఎవ్వరికీ అడ్డు లేదు."

"ఆధ్యాత్మికాభివృద్ధి తెలియదు. కొత్తది రావడం కాదు. ఉన్నది పోవడం."

"ఉన్నది ఒకే చైతన్యం."

# అమ్మ

145. "చీమలో దోమలో కాదు నాన్నా. చీమగా దోమగా ఉన్నాడు."

146. "మీరంతా నేనే. మీదంతా నేనే. ఇదంతా నేనే."

147. "లోపల ఏదో వెలపలా అదే."

148. "ఈ లోకంలో ఒక డింకెవరికీ దణ్ణం పెట్టదు నాన్నా."

149. "తోచిన దేదో చెయ్యి. తోపించేవాడు వాడేగా!"

150. "ఒకటే చూచినప్పుడు మనసు స్వతంత్రురాలే."

151. "అందరూ నా ఒడిలోనే ఉన్నారు. ఒడి విడిచి ఎవ్వరూ లేరు."

# మహర్షి

"అంతర్యామి కాపడానికి ఆయన తప్ప వేరే లేడు. ఉన్నది దేవుడే!"

"నీలో ఈ శరీరం ఉంది.
శరీరమే కాదు; ఈ విశ్వమంతా నీలోనే ఉంది."

"బయట ఉన్నదీ లోపల ఉన్నదీ ఒక్కరే."

"అందరికీ వందన మట. తా నందరిలో వాడు కా డేమి?
తనకు తానే వందనం చెప్పుకుంటున్నా డన్నమాట."

"అన్నిటిని ఒక శక్తి నడుపుతోంది. ఆ దివ్య శక్తి మిమ్మల్ని ఎటు నడిపితే అటు నడవడమే సుఖం."

"మనసు కూడా చైతన్యమే. అయితే మనస్సు తాను పరిమితమని భావిస్తోంది."

"ఆత్మయే అంతటా ఉంది. దేహమే అటూ ఇటూ కదుల్తోంది. ఎంత కదిలినా ఎటు కదిపినా ఆత్మలోనే. కనుక ఆత్మనేత్రం నుండి ఎవ్వరూ తప్పించుకోలేరు."

# అమ్మ

152. "అది తెలిస్తే అది ఇదే అవుతుంది."

153. "అన్ని మంత్రాల శక్తి ఒకటే."

154. "మీరు పరిపూర్ణజ్ఞానస్వరూపులు అనుకొంటున్నాను నాన్నా."

155. "దేహం ఆత్మ కాదంటారు కాని దేహమూ ఆత్మ కాక పోలేదు."

156. "అదే అన్నీ అయి ఉంది."

157. "అందరూ నా ఒడిలోని వారే. ఒడి విడిచి ఎవరూ లేరు."

158. "నేను అది అనుకోడం లేదు, ఇదే అనుకుంటున్నాను."

# మహర్షి

"ఆత్మ తెలిసినప్పుడు ఇవన్నీ దానిలో ఉన్నట్లు తెలుస్తాయి."

"శివ విష్ణు గాయత్రి–అన్నీ సమానమే శక్తిలో."

"జ్ఞాని దృష్టిలో అందరూ జ్ఞానులే!"

"ఆత్మదర్శనానంతరం దేహం ప్రపంచం ఆత్మకు భిన్నంగా జ్ఞానికి కనబడవు. ప్రపంచం, శరీరం అంతా ఆత్మే."

"చూచేవాడు, చూచుట, చూడబడేది – అంతా ఒకే చైతన్యం యొక్క ప్రకటిత రూపాలు."

"కణాలు జ్వాల నుండి పుట్టినా అవి జ్వాలను విడిచి వచ్చి పడుతున్నాయి. ఇక మనమో, భగవంతుని విడిచి బయట ఉండడం లేదు."

"ప్రపంచం ఆత్మ మాదిరిగానే మరొక ఆత్మను కలిగి లేదు. ఆత్మకు భిన్నంగానూ లేదు. ఆత్మలో భాగం కాదు." (ఆత్మే!)

# అమ్మ

159. "చేతలు చేతుల్లో లేవు."

160. "రెండైనదీ రెండు కానిదీ దైవం."

161. "స్థితులు మనుష్యులకే కాదు, జంతువులకు కూడా ఉంటాయి."

162. "ప్రేరణే దైవం."

163. "శక్తిరూపంగా అంతటా ఉన్నదే ఆత్మ."

164. "ఆలోచన లిచ్చేది భగవంతుడే."

165. "తృప్తే ముక్తి."

166. "వైకల్యం లేనిదే కైవల్యం."

# మహర్షి

"చెయ్యడమూ చెయ్యక పోవడమూ నీ చేతుల్లో లేదు. నీవు ఈ జన్మలో చెయ్యవలసింది ముందే నిర్ణయించ బడింది. నీవు ఇష్టపడినా, లేకున్నా ఆ పని నీ చేతనే జరప బడుతుంది."

"ఆత్మ ద్వైతమూ కాదు; అద్వైతమూ కాదు."

"పశు వృక్షాదులునూ ఆత్మసాక్షాత్కార మొందటం అరుదు కాని సంభవమే."

"ప్రతి చర్యకూ ప్రేరణశక్తి ఆయనదే."

"నిజానికి ఆత్మ లేని శక్తికి వ్యాపారమే లేదు."

"ఎక్కడ 'నేను' పుడుతోందో చూడు. మనస్సు (తలపులు) అక్కడ లయిస్తుంది."

"కోరిక లేని స్థితి మోక్షం."

"శాంతి కుదరటమే గదా మోక్షం!"

# అమ్మ

167. "సూపర్ మైండా? పైకి వెళ్ళడాని కేదో దిగడానికీ అదే."

168. "సృష్టికి ఆది లేదు.
ప్రళయమా?–జగత్తు కంతటికీ ఒకేసారి రాదు."

169. "సృష్టి ప్రళయమూ ప్రతిక్షణమూ జరుగుతూనే ఉంటాయి."

170. "జగత్తు ఎప్పుడూ ఉంటుంది. వచ్చేవాడు వస్తుంటాడు. పోయేవాడు పోతూ ఉంటాడు."

171. 'దేవుడు సృష్టి ఎందుకు చేశాడూ?'
"దేవుడు సృష్టే కనుక!"

172. "వాడి అన్నం ఇక్కడ లేకపోతే వాడు ఇక్కడికి రాలేడు. వచ్చినా విస్తరి దగ్గర కూర్చోలేడు. కూర్చున్నా ఒక ముద్దా తినలేడు."

# మహర్షి

"శిరస్సులోని వెల్తురు గుండెలోకి దింపాలన్నారా? గుండెలో ఆత్మలేదా ఏమిటి? అంతటా ఉన్న ఆత్మను ఒక చోటునుండి మరొక చోటుకి ఎలాగ తీసికెళుతారూ?"

"ప్రత్యేకించి సృష్టిమాత్రం గాని, నాశనం మాత్రం గాని ఎప్పటికినీ ఉండవు."

"ప్రతిక్షణంనందును సృష్టి ఉండనే ఉన్నది. ప్రతి క్షణంనందు నాశనం ఉండనే ఉన్నది."

"చూసేవాడే తెలి అయినప్పుడు ఉండేది ఆత్మ మాత్రమే."

"దేవుడు వేరూ సృష్టి వేరూ కాదు."

"మనది కాకపోతే మనకెలా వస్తుందీ?"

# అమ్మ

173. 'కష్టాలు పోగొట్టమని దేవుణ్ణి ప్రార్థించవచ్చా?'
"అఁ నువ్విచ్చిన కష్టాలు నువ్వు తీసెయ్యమని ప్రార్థించవచ్చు."

174. 'వారితో చెప్తే తీరుతాయని.'
"అందరికీ తీర్చవలసినవారు వారే। వారితో చెప్పకో"

175. "ఇక్కడ ఊరికే తింటున్నా మంటే అక్కడ తినేది నీదనా?"

176. "భౌతికమూ అధ్యాత్మికమూ వేరు కావు.
జీవితమూ జీవనమూ భగవంతు డిచ్చినవే।"

177. "మొదటి జన్మలో కర్మ ఎలాగ వచ్చిందీ?
ఎవరిచ్చారూ?"

178 "కృష్ణుడు యశోదకు చూపినదె ఈ విశ్వాన్నే కదూ!"

# మహర్షి

'కష్టాలకు తల్లడిల్లిపోతున్న వ్యక్తి దేవుణ్ణి వేడుకోవడం ఉత్తమమైన పనేనా?'

"నిస్సందేహంగా!"

'మీరు దగ్గరుంటే మేమందరం భూతాలల్లో ఎంతెంత గుండిగలైనా వండి డించుతున్నాం.'

"మీరా! అదిగో పెద్దభూతం. వారు వండుతున్నారు" అని అరుణాచలం చూపించారు.

"తినేదంతా భగవత్ప్రసాదం కాదా ఏమి?"

"లౌకిక జీవితం కూడా ఆధ్యాత్మిక జీవితంలోని భాగమే."

"జన్మకు కారణం అజ్ఞాన మనాలి. కర్మ అనడం కుదరదు. ఎవరి కర్మా? నేను ఎవరూ?"

"విశ్వరూపం అంటే ప్రపంచాన్ని భగవంతుడుగా చూడడం!"

# అమ్మ

179. "మీరంతా అవతారాలే. మీ కోసం ఈ అవతారం."

180. "సంకల్పమే సంసారం."

181. "రాగద్వేషాలు కూడా రహితమైనదే అనసూయ."

182. "తెలియలేదని తెలుసుకున్నావుగా."

183. "అనుకున్నది జరగదు. తనకున్నది తప్పదు."

184. "అన్నం బ్రహ్మ అయితే అశుద్ధమో?"

185. "ఆత్మ, జీవాత్మ, పరమాత్మ–వేరనుకోడం లేదు."

# మహర్షి

"ప్రతివారూ భగవంతుని అవతారమే."

"సంసార మంటే మనస్సంసారమే.
సంకల్పం సంసారానికి దారి తీస్తుంది."

"రాగ విరాగాలు లేనిది వైరాగ్యం."

"అజ్ఞాని–నని తెలుసుకోవడం అజ్ఞానం కాదు."

"ఏమి జరగవలసి ఉన్నదో అదే జరుగుతుంది.
నీకు పనిచెయ్యవలసిన విధి ఉంటే తప్పించుకోలేవు.
నీకు పనిచెయ్యవలసిన విధి లేకపోతే నీవు పని కొరకై వేటాడినా సాధ్యం కాదు."

"కొఅతా గుణమూ నీవే!"

"ఉపాధులూ జీవ పరమ అన్నవాటిని ఆత్మనుంచి తప్పించేసి చెప్పు–ఇంకా తేడా కనబడుతోందా?"

# అమ్మ

186. "ఎవరు ఏ దారిన పోతే వారిని ఆ దారిని పోనిచి మెల్లగా ఇటు త్రిప్పకు రావాలి."

187. "మనస్సే గురువు."

188. "నా దృష్టిలో గురువు అంటే వాడు (దైవం) తప్ప మరొకడు లేడనే."

189. "వాళ్ళ విశ్వాసమే వాళ్ళని రక్షిస్తుంది - నాన్నా."

190. "గురువు మీలోనే ఉన్నాడు. గురువు బయట ఎక్కడో ఉన్నాడనుకోవడం ఎరక్క."

191. "ధ్యాసే ధ్యానం."

192. "నీ మార్గమే సులువు. నీ మార్గమే మంచిది."

193. "నువ్వు చెయ్య గలిగినదే నీకు సులభమార్గం."

# మహర్షి

"గురువు మొదట శిష్యుని వెంట వాని మార్గాననే పోయి తగిన సమయం రాగానే నెమ్మదిగా అతనిని పరమ పదంలోకి మరలిస్తాడు."

"ఆత్మావై గురుః"

"గురువూ ఈశ్వరుడూ అని భేదంగా చూస్తావెందుకూ? గురువే ఈశ్వరుడు."

"అసలు గురువు యోగ్యత కాదు ముఖ్యం; శిష్యుడి భక్తి."

"మీ మనస్సే మీ గురువు."

"దానినే ఇంద్రియాల ద్వారా వ్యక్తం చేయక మనస్సులో తిప్పితే అదే ధ్యానం."

"నీకు నచ్చినదీ సుళువైనదీ మార్గం నువ్వెంచుకో."

"ఏ ప్రకృతికి ఏది అనుగుణమో ఆ దారిని పోవచ్చు."

# అమ్మ

194. "ఏదారి అయినా మంచిదే. నీ దారే నీకు మంచిది."

195. "చేతులు జోడించడమే నమస్కారం కాదు."

196. అమ్మ వరంగల్ స్వర్ణకారుణ్ణి "నామంతో నీ గుండెలో గుడి కట్టు. రాతితో కడితేనేనా గుడి?" అన్నారు.

197. "భక్తితో చేస్తే పాకీదొడ్డిలో నయితే మాత్రమేం?"

198. "నీకు నీవు మొదట వచ్చినప్పుడు అన్న మూడు మాటలూ చాలు. (అవి నమస్తే విశ్వనాధ సర్వనాధ జగన్నాధ అన్నవి.) అని వ్యాసకారులతో అమ్మ.

199. "చేద్దామనుకున్నప్పుడు మనసు నిలవదంటున్నారు. కనుక వీలైనప్పుడల్లా అదే చేస్తూండండి."

# మహర్షి

"మనో శుద్ధికి అన్ని (మార్గాలూ) మంచివే. శుద్ధ మనస్సే తనకు ఉచితమైన మార్గాన్ని ఎన్నుకొని అభ్యసించ గలదు."

"మనస్సు స్వస్థితియందు అణగుటే నమస్కారం."

టిన్నూరులో పోసలాల్ సంకల్పంతోనే గుడికట్టిన కథ రమణులు చెప్పేరు.

"ధ్యానానికి విధిగా ప్రత్యేకమైన కాలమూ ఆసనాలూ నియమాలూ ఉండ నవసరం లేదు."

దిలీప్‌కుమార్ రాయితో "ఆహా. సంకీర్తనం చాలునే. అది తీసుకుపోతుంది" అన్నారు.

"ధ్యానం చెయ్యడానికి సమయం దొరకడం లేదా? అయితే పని చేస్తున్నప్పుడు "నేను" "నేను" అని జపించండి."

# అమ్మ

200. "మననంతో మంత్రమైంది."

201. "అంతా నువ్వే ననుకున్నా సరే; లేదా ఏదో శక్తి అంతా జరిపిస్తోం దనుకున్నా సరే."

202. "అదీ వా డివ్వవలసినదే."

203. "దేనికైనా తరుణం రావాలి."

204. "ఆవేదన ఆరాధనే నన్నూ."

205. "క్రియా కర్మా కర్తలోనివే."

206. "అనాత్మ అంటూ బయలుదేరితే కాని అంతా ఆత్మే నని తేలదు."

207. "అడిగిన వారికి అడిగినవే ఇస్తుంది.
అడగని వారికి ఏది కావాలో తెలుసుకొని అమ్మే ఇస్తుంది."

# మహర్షి

"మననం చేస్తే తక్కిన ఆలోచనలన్నీ తప్పుకుంటాయి."

"నేను అన్న ఆలోచనకి మూలం వెతికినా సరే; నిర్వహించే శక్తికి అర్పణ అయిపోయినా సరే."

"ఏ యత్నమైనా విధిని బట్టే జరుగుతుంది."

"పక్వకాలంలోనే బోధబీజం మనోక్షేత్రాన పడుతుంది."

"దర్శనం కన్నా దర్శనంకోసం ఆవేదన ముఖ్యం."

"కర్తను తెలుసుకుంటే తెలుసుకోబడేవన్నీ కర్తలోనే అదృశ్యమౌతాయి."

"నిజానికి అనాత్మ అంటూ లేదు. అనాత్మ అనబడేది ఆత్మలోనిదే!"

"నీకు ఏది మేలో భగవంతుడికి ఒక్కడికే తెలుసు. ఆయనకే అంతా వదులు. నీకేది అవసరమో అది ఆయనే ఇస్తూ ఉంటాడు."

# అమ్మ

208. "మీకు అనిపించిందే వినిపించి ఉంటుంది లెండి"

209. "అదీ ఆయన ఇవ్వవలసిందే"

210. "సృష్టి భగవంతుడే."

211. "ప్రేమే దైవం."

212. "పురుషకారమూ దైవసహాయమూ ఒకదానివే."

213. "అన్ని రూపాలూ అయనవే."

214. "అంతా అదే."

215. "నొప్పి వాడే."

216. "అన్ని పేరులూ ఆయనవే కనుక పేరు లేని వాడు. అన్ని రూపాలూ అయనవే కనుక రూపం లేని వాడు."

# మహర్షి

"మనం చెప్పే దేమిటి? ఏదో శక్తి ఆవిధంగా తానే చెప్పిస్తుంది."

"భగవంతుని తలవడం ఆయన ప్రసాదమే."

"సృష్టి—దైవం తనను తాను చూసుకోడానికి అద్దం."

"ప్రేమే దైవం"

"సర్వశక్తుడైన భగవంతుడు పురుషకారం ద్వారా లోకంలో పనిచేస్తున్నాడు."

"ఇన్ని రూపాలుగా కనబడుతున్నది ఒక్కటే."

"జగత్తు జీవుడు ఈశ్వరుడు— ఒకే వస్తువు."

"నొప్పి వాడిచ్చినదే."

"పేరూ లేదు, రూపమూ లేదు. ఉన్నది ఒకటే."

# అమ్మ

217. "చేయించేది ఆయనైనప్పుడు ఫలితాలు మట్టుకు ఆయనవి కావూ?"

218. "అది చూచినవాడికి ఇది అదే అని తెలుస్తుంది."

219. "దానికే పేరు అయినా పెట్టు. ఉన్నదదే నాన్నా."

220. "నువ్వు పేరేదైనా పెట్టు—దేవుడూ, స్వభావమూ, శక్తీ—అని. ఉన్నదొక్కటే."

221. "అదే ఇవన్నీ అయి ఉన్నది."

222. "దేవుళ్ళాడితే దొరకని వాడే దేవుడు."

223. "నా దృష్టిలో అంతా చైతన్యమే. జడమే లేదు."

224 "ఒక ఆత్మకు మనం శరీరాలము."

# మహర్షి

"మంచీ చెడ్డా అయనవే అయితే సుఖం దుఃఖం మాత్రం అయనవే కావూ?"

"నిజమైన దివ్యజీవనం అర్థమైతే లౌకిక జీవనం దానికి భిన్నమైంది కాదని సుస్పష్టంగా గ్రహించగలం."

"ఏ పేరు పెట్టుకొన్నా — ఉన్న వస్తు వొక్కటే."

"ప్రపంచం, మాయ, లీల, శక్తి — ఇవన్నీ ఆత్మ లోనివే."

"ప్రపంచం వివిధ వస్తుజాలం. నీవు ఎక్కడనుండి ఉద్భవిస్తున్నావో అదీ అక్కడినుంచే ఉద్భవిస్తోంది."

"ను వ్వెక్క డున్నావూ, దేవు డెక్క డున్నాడూ— నువ్వు వెళ్ళి చూడడానికి?"

"ఈ విశ్వమంతా ఆత్మయొక్క వ్యాపకమే."

"ఆత్మ స్థిరంగా ఉంటుంది. శరీరాలే కదులుతూ ఉంటాయి."

# అమ్మ

225. 'మీ అనుగ్రహం కావాలమ్మా—'
"అది ఎప్పుడూ ఉంది. మీ పనులవడమూ అనుగ్రహమే, కాకపోవడమూ అనుగ్రహమే. అనుగ్రహం ఎప్పుడూ ఉంది. మన కనుకూలమైనది జరిగినప్పుడు ఉన్నదనుకుంటాం. వ్యతిరేకంగా జరగడమూ అనుగ్రహమే."

226. "మీ యత్నం మీరు చెయ్యండి. తరుణం వచ్చినప్పుడు పనులు వాటంతట అవే అవుతాయి."

227. "భక్తి కూడా అది ఇవ్వవలసిందే."

228. "ఎక్కడనుండి వచ్చాడూ? దైవం నుండి. పోయేదీ అక్కడికే."

229. "స్థితప్రజ్ఞకూడా కావాలని లేకపోవడమే స్థితప్రజ్ఞ."

# మహర్షి

'మీ అనుగ్రహం కావాలి.'
"అనుగ్రహం ఎప్పుడూ ఉంది."

"మీ పని మీరు చూసుకోండి. కాలం పరిపక్వమైనప్పుడు ఈశ్వరకృప దానంతటదే వర్షిస్తుంది."

'అనుగ్రహం లేకుండా నేనే సాధనా చెయ్యలే'నని ఒకాయన అంటే—
"నీలో సాధన చెయ్యాలన్న కోరిక కలిగించినది అనుగ్రహమే" అన్నారు మహర్షి.

ఫిలిప్సుతో "మీ అబ్బాయి ఆత్మనుంచి వచ్చి ఆత్మలో లీనమైనాడు."

"ఏమీ కోరరట. ఒక్క మోక్షం ఇస్తే చాలట. అది మాత్రం కోరిక కాదు కాబోలు."

# అమ్మ

230. "అన్నీ నేనే చేస్తున్నాననేనా అనుకో.
అన్నీ ఏదో శక్తి చేయిస్తోందనేనా అనుకో."

231. "జీవుడంటూ ఒక చిన్న రూప మున్నదా?"

232. "అహానికి ఆకారం వచ్చి అహంకార మైంది."

233. "సౌఖ్యానికి దారిగా కనిపిస్తూ దుఃఖానికి దారి చేస్తుంది నాది అనేది."

234. "సన్యాసి కావలె కాని పుచ్చుకోవడం కాదు."

235 "ఏది వచ్చినా హాయిగా అనుభవించు."

236. "తోచిందేదో చెయ్యి. తోపించేవాడు వాడేగా."

237. "శరీరం ఆత్మ కాదంటారు కాని శరీరం ఆత్మ కాక పోలేదు."

238. "శక్తి మయంగా అంతటా ఉన్నదే ఆత్మ."

# మహర్షి

"నేను జపిస్తున్నాననే భావం ఉన్నప్పుడు దురభ్యాసాలవల్ల కలిగే పాపం మాత్రం ఎందు కంటదు?"

"నేను అనేది వేరే ఉంటే కదా అర్పించడం?"

"నేను ఇది, నేను అది– అంటే అహంకారం."

"నాది అన్నభావం వదిలేస్తే మనస్సు శుద్ధ మౌతుంది."

"అహంకారం వదిలేయడం సన్యాసం; వస్త్రాలు మార్చడం కాదు."

"వచ్చేది రానీ, పోయేది పోనీ – నీకేమి?"

"మీకు ఏ పద్ధతి ఉత్తమంగా సులభంగా తోస్తుందో దానినే అనుసరించండి."

"యదార్థం తెలుసుకొన్న జ్ఞానికి తన శరీరం గూడా తాను గానే తోస్తుంది."

"ఆత్మయే యిన్ని విధాల శక్తులుగా నై ఉన్నది."

# అమ్మ

239. "అన్నీ అదే. ఒక్కటే అన్నీ అయింది."

240. "అన్నీ నేనే."

241. "ప్రతివారూ చూచేది ఆత్మనే! రూపాలు తెరమీది బొమ్మలు. సముద్రంమీది బుడగలు."

242. "నే నేదో ఇస్తే ఒడిపట్టడం కాదు. ఏది ఇచ్చినా ఒడి పట్టాలి."

243. "శాంతి అంగట్లో దొరుకుతుందా?"

244. "జ్ఞానంవల్ల పొందట మేమీ లేదు.
జ్ఞానం పొందటమే!"

245. "సర్వకాల సర్వావస్థలయందూ సమానస్థితే సమాధి."

246. "సర్వకాల సర్వావస్థలలోనూ సమానస్థితే సమాధి."

247. "ఆలోచన వల్లనే సందేహాలు తీరాలి."

---

# మహర్షి

"సత్తు చిత్తు ఆనందం.... ఇంకా ఎన్నెన్నో అయింది. ఉండే వస్తువు ఒకటే."

"తన కన్నా అన్య మేమీ కానరాదే!"

"కనబడే దంతా అదే!"

"సుఖంవల్ల పెంపెక్కని, దుఃఖంవల్ల దిగజారని స్థితికి రావాలి."

"మోక్షమేమైనా అంగట్లో దొరుకుతుందా?"

"చూడడం అనేది లేదు. కేవలం అవటమే ఆత్మ దర్శనం."

"కొన్ని నిమిషాలూ లేదా గంటలు మాత్రమే ఉండేది సమాధి కాదు. ఇంద్రియాలు పనిచేస్తూ ఉండగా సమాధిలో ఉండడం సహజ సమాధి."

"ఎప్పుడూ ఏ పరిస్థితులలోనూ సమాధిలో ఉండాలి."

"ఆలోచించే వాణ్ణి పడితే సందేహాలు తీరుతాయి."

——

# మా ప్రచురణలు